# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **తెలుగు భక్తి** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **తెలుగు భక్తి** వారి వెబ్ సైట్: http://www.telugubhakti.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

తెలుగు భక్తి వారి వెబ్ సైట్:

http://www.telugubhakti.com/

Telugu Bhakti Slokas

www.telugubhakti.com/telugupages/main.htm

# Telugu Bhakti Pages

www.telugubhakti.com

**Best viewed with screen settings 1280X1024 pixels**

| Scriptures, Slokas and Stotras | | General | Downloads |
|---|---|---|---|
| Adi Sankaracharya<br>Aditya<br>Adwaitam<br>Ayyappa<br>Bhagavad Geetha<br>Bammera Pothana<br>Bhagavatam<br>Brahma Sutras<br>Durga<br>Dattatreya<br>Ganesh<br>Gayatri<br>Guru<br>Hanuman<br>Hindu Marriage System<br>Krishna<br>Lakshmi<br>Mahabharat<br>Mantrapushpam<br>Narada Bhakti Sootralu<br>Nava Grahas<br>Patanjali Yoga Sootralu<br>Raghavendra<br>Rama<br>Ramayanam | Rama Geeta<br>Saraswathi<br>Sandharbha<br>Satya Sai<br>Shirdi Sai<br>Siva<br>Slokas with meaning<br>Subrahmanya<br>Suktas<br>Sundara Kanda<br>Venkatesa<br>Vishnu<br>Vratas<br>Upanishads<br>Rigveda<br>Samhitaanuvadam<br>(Yoga Paranga)<br>Vyasa Bhagavatam | Appeal and Objectives<br>Bala Basha<br>Bhakti Celebrities<br>Bhakti Classicals<br>Bhakti Links<br>Book Reviews<br>Jeji Mamayya Patalu<br>Chatuvulu<br>Dasa Mudrani<br>Divine Guidance of Satya Sai<br>Kavitha Kadambam<br>Keerthanalu<br>Koonalamma Padalu<br>Prasnalu - Javaabulu<br>Naturopathy<br>Rishi Vani<br>Sai Krishna's Art<br>Satakalu<br>Swamiji<br>Tatvalu<br>Telugu Special<br>Useful Links<br>Value Education<br>Web Hunt<br>Hindu Cultural<br>Questions & Answers<br>Yoga<br>Yoga Mudralu Bandhalu<br>Yogasanas (Detailed) | Audio Downloads<br>Bhakti Screen Savers<br>Printer Friendly Page<br>**Pravachanaalu**<br>Bhaja Govindam<br>Bhasmo Dhulita Vigrahaya<br>Karma Siddhantam<br>Class Prayers<br>Kenopanishad<br>Sri Narasimha Charitram<br>Soundarya Lahari<br>Ramana Saranagathi<br>Vivekachoodamani<br>**Specials**<br>Annamayya Pada Visleshana<br>Monthly<br>Satsang<br>Chinna Kathalu<br>Class Prayers<br>Human Relations<br>Nadiche Devudu<br>Stories of Alwars<br>Stories of Bhaktas<br>Stories of Indian Sages<br>Stories of Nayanars<br>Sankara Vangmayamu<br>Special Articles<br>Hinduism and Mantras<br>Personality Development |

Join Bhakti Group

Statistics of page views

[About us][Mission][People][Links][Books][Guest Book][Contact]

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఓం తత్ సత్

## శాంతి పాఠం

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః।
భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః।
స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః।
వ్యశేమ దేవహితం యదాయుః।
స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః।
స్వస్తి నః పూషా విశ్వవేదా।
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః।
స్వస్తి నో బృహస్పతి ర్దధాతు॥

ఓం శాంతిః శాంతిః శాంతిః॥

ఓ దేవతలారా! మేం చెవులతో శుభప్రదమైనదాన్ని వింటాం గాక. మేం కళ్లతో శుభప్రద మైన దాన్ని చూస్తాంగాక. మీ స్తోత్రాలను గానం చేస్తూ మాకు నియమితమైన ఆయుష్కాలాన్ని పరిపూర్ణమైన ఆరోగ్యంతో, బలంతో జీవిస్తాం గాక.

కీర్తిమంతుడైన ఇంద్రుడు, సర్వజ్ఞుడైన సూర్యుడు, ఆపదల నుండి రక్షించే గరుత్మం తుడు, మా బ్రహ్మవర్చస్సును పాలించే బృహస్పతి, మాకు శుభాన్ని కలుగచేస్తారుగాక.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# ముండకోపనిషత్తు

## ప్రథమ ముండకం

### ప్రథమ ఖండం

ఓం బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ
విశ్వస్య కర్తా భువనస్య గోప్తా।
స బ్రహ్మవిద్యాం సర్వవిద్యా ప్రతిష్ఠామ్
అథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ॥ 1

సృష్టికర్తా, జగద్రక్షకుడూ ఐన బ్రహ్మా దేవతలందరికంటే ముందు పుట్టాడు. ఆయనే జగత్తు సృష్టికర్త, రక్షకుడు. ఆయన సకలశాస్త్రాలకూ ఆధారభూతమైన బ్రహ్మవిద్యను తన పెద్ద తనయుడైన అథర్వునకు అనుగ్రహించాడు.

అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మా-
ఽథర్వాతాం పురోవాచాంగిరే బ్రహ్మవిద్యామ్।
స భారద్వాజాయ సత్యవహాయ ప్రాహ
భారద్వాజోఽంగిరసే పరావరామ్॥ 2

బ్రహ్మ అథర్వునకు ఉపదేశించిన బ్రహ్మవిద్యను ప్రాచీన కాలంలో అథర్వుడు అంగిరునకు బోధించాడు. ఆ విద్యనే భరద్వాజగోత్రుడైన సత్యవహుడు అంగిరుని వద్ద గ్రహించాడు. ఇలా పరంపరగా వస్తున్న అపరావిద్యను సత్యవాహుడు అంగిరసునికు అందజేశాడు.

శౌనకో హ వై మహాశాలోఽంగిరసం
విధివదుపసన్నః పప్రచ్ఛ।
కస్మిన్ను భగవో విజ్ఞాతే
సర్వమిదం విజ్ఞాతం భవతీతి ॥ 3

శునక ఋషి కుమారుడూ ఉత్తమ గృహస్థుడని పేరు పొందిన వాడూ ఐన శౌనకుడూ శాస్త్రోక్తరీతిగా అంగీరస మహర్షిని సమీపించి వినమ్రుడై "హే భగవన్, దేనిని తెలుసుకోవడం చేత ఈ ప్రపంచం అంతా తెలుసుకోబడుతుంది?" అని అడిగాడు.

తస్మై స హోవాచ। ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ యద్
బ్రహ్మవిదో వదంతి, పరా చైవాపరా చ ॥ 4

అంగిరసుడు శౌనకునికి ఇలా బదులు చెప్పాడు. పరావిద్య అపరావిద్య అని తెలుసుకో వలసిన విద్యలు రెండు ఉన్నాయని బ్రహ్మవిదులు చెబుతారు.

తత్రాపరా, ఋగ్వేదో యజుర్వేదః
సామవేదోఽథర్వవేదః శిక్షాకల్పో
వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి ।
అథ పరా, యయా తదక్షర మధిగమ్యతే ॥ 5

ఈ రెండు విద్యల్లో నాలుగు వేదాలూ, వేదాంగాలైన శిక్షా, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సూ, జ్యోతిషమూ అన్నీ అపరా విద్యలే. ఇక శాశ్వతమూ అమరమూ ఐన తత్వాన్ని అందించే విద్యే పరావిద్య.

యత్ తదద్రేశ్య మగ్రాహ్యా మగోత్రమ్ అవర్ణమ్
అచక్షుః శ్రోత్రం తదపాణిపాదమ్ ।
నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
తదవ్యయం యద్ భూతయోనిం పరిపశ్యంతిధీరాః॥ 6

కళ్ళు మొదలైన జ్ఞానేంద్రియాలకు గోచరంకానిదీ, చేతులు మొదలైన కర్మేంద్రియాలకు దొరక నిదీ, ఉత్పత్తిలేనిదీ, రంగు లేనిదీ, కళ్లు చెవులు చేతులు కాళ్లు లేనిదీ, శాశ్వతమైనదీ, అంతటా వ్యాపించినదీ, అత్యంతమూ సూక్ష్మమైనదీ సృష్టికి మూలకారణమైనది ఐన ఆ అక్షరతత్త్వాన్ని జ్ఞానులు సకల జగత్తుకూ మూలంగా అంతటా చూడగలరు.

యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ
యథా పృథివ్యామ్ ఓషధయః సంభవంతి ।
యథా సతః పురుషాత్ కేశలోమాని
తథాఽక్షరాత్ సంభవతీహ విశ్వమ్ ॥ 7

సాలెపురుగు ఎలా తన గూడును నోటి నుండే వెలికితీసి తన లోకే తీసుకుంటుందో, భూమినుండి మూలికలన్నీ ఎలా ఉద్భవిస్తాయో, మానవుని తలమీద, శరీరంమీద ఏ ప్రయత్నం లేకనే వెంట్రుకలు ఎలా పెరుగుతాయో అలాగే ఆ అక్షరతత్త్వం నుండి ఈ విశ్వం ఉత్పన్నమౌతుంది.

తపసా చీయతే బ్రహ్మ తతోఽన్నమభిజాయతే ।
అన్నాత్ ప్రాణో మనః సత్యం లోకాః కర్మసు చామృతమ్ ॥ 8

తపస్సు వల్ల బ్రహ్మ పెంపొందుతుంది. ఆ బ్రహ్మంనుండి అన్నం పుడుతుంది. ఆ అన్నం నుండి ప్రాణశక్తి, మనస్సు, పంచభూతాలు, లోకాలు, కర్మలు అన్నీ ఉద్భవించాయి.

యః సర్వజ్ఞః సర్వవిద్యస్య జ్ఞానమయం తపః।
తస్మాదేతద్ బ్రహ్మ నామరూపమన్నం చ జాయతే ॥ 9

సృష్టికర్త, సర్వవిదుడు, జ్ఞానమే తపంగాగల బ్రహ్మ సకల ప్రాణులు వాటి ఆహారం అన్నీ పరబ్రహ్మంనుండి ఉద్భవిస్తున్నవి.

ఇది మొదటి ముండకంలో మొదటి ఖండం.

## ద్వితీయ ఖండం

తదేతత్ సత్యమ్
మంత్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యం-
స్తాని త్రేతాయాం బహుధా సన్తతాని।
తాన్యాచరథ నియతం సత్యకామా
ఏష వః పన్థాః సుకృతస్య లోకే ॥ 1

ఋషులు వేదమంత్రాలలో ఏయే యజ్ఞకర్మలను దర్శించారో అవి అన్నీకూడా సత్యమే. మూడు వేదాలు వీనిని చాలా వివరంగా వర్ణిస్తాయి. సత్యప్రియులారా! వాటిని మీరు విధిగా నిరంతరం అనుష్ఠించండి. పుణ్యకర్మల ఫలితాలైన లోకాలకు మార్గం అదే.

యదా లేలాయతే హ్యర్చిః సమిద్ధే హవ్యవాహనే।
తదాఽఽజ్యభాగౌ అన్తరేణాఽఽహుతీః ప్రతిపాదయేత్ ॥ 2

హోమాగ్ని చక్కగా మండుతూ జ్వాలలు లేస్తూ ఉన్నపుడు అగ్నికి రెండుభాగాల మధ్య శ్రద్ధతో ఆహుతులు సమర్పించాలి.

యస్యాగ్నిహోత్రమ్ అదర్శమ్ అపౌర్ణమాసం
అచాతుర్మాస్యమ్ అనాగ్రయణమ్ అతిథివర్జితం చ ।
అహుతమ్ అవైశ్వదేవమ్ అవిధినా హుతం
ఆసప్తమాంస్తస్య లోకాన్ హినస్తి ॥ 3

అగ్నిహోత్రయజ్ఞంలో అమావాస్యనాడు, పున్నమినాడు చాతుర్మాస్యంలో పంట నూర్పిడి సమయంలోచేయాల్సిన కర్మలు చేయకపోయినా, యజ్ఞసమయంలో చేయాల్సిన కర్మలు చేయకపోయినా, యజ్ఞసమయంలో అతిథులు లేకపోయినా, విశ్వేదేవతలకు ఆహుతులు లేకపోయినా, పశుపక్ష్యాదులకు ఆహారదానం చేయకపోయినా, శాస్త్రవిధికి విరుద్ధమైనా - అలాంటి యజ్ఞం ఏడులోకాలలోనూ యజ్ఞకర్త ఉత్తరగతులను నాశనం చేస్తుంది.

కాలీ కరాలీ చ మనోజవా చ
సులోహితా యా చ సుధూమ్రవర్ణా।
స్ఫులింగినీ విశ్వరుచీ చ దేవీ
లేలాయమానా ఇతి సప్త జిహ్వాః॥ 4

కాలీ, కరాలీ, మనోజవా, సులోహితా, సుధూమ్రవర్ణా, స్ఫులింగినీ, విశ్వరుచీ అనే ఈ ఏడు భుగభుగలాడే అగ్నికి ఏడు నాలుకలు.

ఏతేషు యశ్చరతే భ్రాజమానేషు
యథాకాలం చాఽఽహుతయో హ్యాదదాయన్।
తం నయన్త్యేతాః సూర్యస్య రశ్మయో
యత్రదేవానాం పతిరేకోఽధివాసః॥ 5

దేదీప్యమానమైన ఈ జ్వాలలో ఎవడు యథాకాలంలో ఆహుతులిస్తూ ఉంటాడో, అతణ్ణి ఆ ఆహుతులు సూర్యకిరణాలై దేవతలకు ప్రభువైన ఇంద్రుడు నివసించే స్థానానికి తీసుకు వెళతాయి.

ఏహ్యేహీతి తమాహుతయః  సువర్చసః
సూర్యస్య రశ్మిభిర్యజమానం వహన్తి।
ప్రియాం వాచమ్ అభివదన్త్యోఽర్చయన్త్య
ఏష వః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః॥ 6

కళకళలాడే ఆ ఆహుతులు 'రండి రండి' అని ఆహ్వానిస్తూ యజ్ఞకర్తను సూర్యకిరణాల ద్వారా తీసుకుపోతాయి. మధురంగా మాటలాడుతూ సన్మానపూర్వంగా 'మీరు మీ పుణ్యకర్మలచేత ఆర్జించుకొన్న పావనమైన బ్రహ్మలోకంఇదే' అంటూ అతణ్ణి కొనిపోతాయి.

ప్లవాహ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్తమ్ అవరం యేషుకర్మ।
ఏతచ్ఛ్రేయో యేఽభినన్దన్తి మూఢా
జరామృత్యుం తే పునరేవాపి యన్తి॥ 7

పద్దెనిమిది అంగాలతో కూడిన యజ్ఞకర్మలన్నీ నిజానికి దుర్బలాలైన తెప్పలవంటివే. ఇదే జీవిత పరమార్ధమని కొనియాడే మూర్ఖులు నిస్సంశయంగా మళ్ళీ మళ్ళీ జరామృత్యు చక్రంలో పడి తిరుగుతూ ఉంటారు.

అవిద్యాయామన్తరే వర్తమానాః
స్వయం ధీరాః పణ్డితం మన్యమానాః।
జంఘన్యమానాః పరియన్తి మూఢా
అన్ధేనైవ నీయమానా యథాన్ధాః॥ 8

ప్రాపంచికత అజ్ఞానంలో ఊరుతూ తామే ప్రజ్ఞాశీలురం, విదితవేదితవ్యులమూ అని ఆత్మస్తుతి చేసుకునే మూర్ఖులు రోగం, ముసలితనం, మృత్యువు వంటి దుఃఖ పరంపరలచేత మళ్ళీ మళ్ళీపీడింపబడుతూ గుడ్డివాని నేతృత్వంలో నడిచే మరికొందరు గుడ్డివాళ్లలా జన్మజన్మలకూ దారి తెలియక తిరుగాడుతూ ఉంటారు.

అవిద్యాయాం బహుధా వర్తమానా
వయం కృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః।
యత్కర్మిణో న ప్రవేదయంతి రాగాత్
తేనాతురాః క్షీణలోకాశ్చ్యవంతే॥ 9

అజ్ఞానంలో మునిగి ఉన్న ఈ మూర్ఖులు తామే కృత కృత్యులమని భావిస్తూంటారు. ఎందుచేతనంటే కర్మఫలాలపట్ల ఆసక్తి ఉన్నంతవరకు వారికి జ్ఞానోదయం కాదు. అందుచేత పుణ్యకర్మల ఫలితామైన స్వర్గాది లోకాలు అనుభవించాక వారికి మళ్ళీ అధోగతే ।

ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్యచ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః।

నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వా
ఇమం లోకం హీనతరం వా విశన్తి ॥ 10

ఈ మందబుద్ధులు యజ్ఞకర్మలు, పుణ్యకార్యాలూ మాత్రమే సర్వోత్తమమైన వనుకొం టూ అంతకు మించినది లేదనుకొంటారు. వీళ్ళు భోగాలకు పుట్టినిళ్లయిన స్వర్గలోకాలలో తమ పుణ్యఫలాన్ని అనుభవించి మళ్ళీ ఈ లోకాన్ని వదలి హీనమైన లోకాల్లో ప్రవేశిస్తారు.

తపః శ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే
శాన్తా విద్వాంసో భైక్ష్యచర్యాం చరన్తః।
సూర్యద్వారేణ తే విరజాః ప్రయాన్తి
యత్రామృతః స పురుషో హి అవ్యయాత్మా॥ 11

శాంతచిత్తులు, విద్వాంసులు భిక్షాటనవ్రతులై అడవిలో ఏకాంతంగా శ్రద్ధాపూర్వకమైన తపోనిష్ఠతో జీవితాన్ని గడిపే సత్పురుషులు పాపధూళిని కడిగివేసుకుని సూర్యమార్గం ద్వారా శాశ్వతం అక్షయం ఐన తత్త్వం ఉండే చోటికి చేరుకుంటారు.

పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో
నిర్వేదమాయాత్ నాస్త్యకృతః కృతేన।
తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥ 12

వివిధ కర్మలద్వారా ప్రాప్తించే లోకాలను పరీక్షించి ముముక్షువు వానిపట్ల వైరాగ్యాన్నీ, ఔదాసీన్యాన్ని వహించాలి. కర్మలువల్ల పరతత్త్వాన్ని పొందలేము! అందుచేత ఆ తత్త్వాన్ని తెలు సుకోవడానికి అతడు విధ్యుక్తంగా వేదవిదుడు, బ్రహ్మనిష్ఠుడు ఐన గురువువద్ద శిష్యరికం చేయాలి.

తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్
ప్రశాన్త చిత్తాయ శమాన్వితాయ।
యేనాక్షరం పురుషం వేద సత్యం
ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥ 13

సాధనసంపత్తి కలిగి నిశ్చలమైన మనస్సుతో యథావిధిగా సమీపించిన ఆ ముము క్షువుకు, జిజ్ఞాసువుకు ప్రాజ్ఞుడైన గురువు అక్షరమైన తత్త్వాన్ని అందించే బ్రహ్మవిద్యను సాక ల్యంగా ఉపదేశించాలి.

ఇది మొదటి ముండకంలో రెండవ ఖండం.

## ద్వితీయ ముండకం

### ప్రథమ ఖండం

తదేతత్ సత్యమ్ఽ యథా సుదీప్తాత్ పావకాద్
విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః।
తథాఽక్షరాత్ వివిధాః సోమ్య భావాః
ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి॥ 1

సత్యం ఇదే: జ్వాలలు లేస్తున్న మంటలనుండి అటువంటివే నిప్పురవ్వలు వేలకొలది ఎలా పుట్టుకొస్తాయో, సరిగా ఆ విధంగానే అక్షరమైన బ్రహ్మంనుండి నానావిధాలైన జీవులు ఉద్భవిస్తాయి. మళ్ళీ అందులోనే లీనమవుతాయి.

దివ్యో హ్యమూర్తః పురుషః
సబాహ్యాభ్యన్తరో హ్యజః।
అప్రాణో హ్యమనాః శుభ్రో
హ్యక్షరాత్పరతః పరః॥ 2

స్వతః ప్రకాశం, నిరాకారం, అనాది శుద్ధం, సర్వవ్యాపకం ఐన ఆ తత్త్వం లోపల వెలుపల కూడా ఉంది. జీవానికి మనస్సుకు ప్రాచీనమైన ఆ తత్త్వం అవ్యక్తమై జగత్తు కారణ రూపానికి కూడా అతీతమైనది.

ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ ।
ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ ॥ 3

ఆ తత్త్వం నుండే జీవం, మనస్సు, అన్ని ఇంద్రియాలు, గాలి, ఆకాశం, నిప్పు, నీళ్ళు, సకలాధారమైన భూమి అన్నీ పుట్టాయి.

అగ్నిర్మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ
దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః।
వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య
పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాన్తరాత్మా॥ 4

ఆ తత్త్వానికి దేవలోకం శిరస్సు. సూర్యచంద్రులు కళ్ళు. దిక్కులు చెవులు. ప్రసిద్ధములైన వేదాలు తెరిచి ఉన్న నోళ్ళు, గాలి ఊపిరి. జగత్తు గుండె. ఈ భూమి పుట్టుక పాదాల నుండే. ఈ తత్త్వమే సర్వభూతాలలోనూ ఉన్న ఆత్మకూడా.

తస్మాదగ్నిః సమిధో యస్య సూర్యః
సోమాత్పర్జన్య ఓషధయః పృథివ్యామ్ ।
పుమాన్ రేతః సించతి యోషితాయాం

బహ్వీప్రజాః పురుషాత్ సంప్రసూతాః॥ 5

ఆ తత్త్వం నుండి దేవలోకం పుట్టింది. సూర్యుడు దేవలోకాన్ని ప్రకాశింపచేస్తున్నాడు. దేవలోకంలో ఉన్న చంద్రుడి నుండి వర్షమేఘాలు, ఆ మేఘాల వర్షంవలన భూమిపైన ఓష ధులు జనించాయి. పురుషుడు స్త్రీ యందు రేతస్సు విడవడం ద్వారా జీవులు పుట్టాయి. ఈ విధంగా సర్వవ్యాపి ఐన ఆ తత్త్వం నుండి ఎన్నో జీవులు పుట్టుకొచ్చాయి.

తస్మాదృచః సామ యజూంషి దీక్షా
యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ ।
సంవత్సరశ్చ యజమానశ్చ లోకాః
సోమో యత్ర పవతే యత్ర సూర్యః॥ 6

ఈ తత్త్వంనుండి వేదబుక్కులు సామగానాలు యజ్ఞవిధులు వ్రతదీక్షలు క్రతువులు కర్మలు యజ్ఞ దక్షిణలు యజ్ఞసమయం యజమాని సూర్యచంద్రులు పావనం చేసే లోకాలు అన్నీకూడా ఉద్భవిస్తాయి.

తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః
సాధ్యా మనుష్యాః పశవో వయాంసి।
ప్రాణాపానౌ వ్రీహియవౌ తపశ్చ
శ్రద్ధా సత్యం బ్రహ్మచర్యం విధిశ్చ॥ 7

ఆ తత్త్వంనుండి వివిధ లోకాలలోని దేవతలు, సాధ్యులు, మానవులు, జంతువులు, పక్షులు ఉచ్ఛ్వాసనిశ్వాసాలు, వరి యువధాన్యాలు, తపస్సు, శ్రద్ధ, సత్యం, బ్రహ్మచర్యం. విధినిషేధాలు అన్నీకూడా పుట్టుకొచ్చాయి.

సప్తప్రాణాః ప్రభవన్తి తస్మాత్
సప్తార్చిషః సమిధః సప్త హెూమాః।
సప్త ఇమే లోకా యేషు చరన్తి ప్రాణా
గుహాశయా నిహితాః సప్త సప్త॥ 8

ఆ పరతత్త్వం నుండి ఏడు ఇంద్రియాలు, వాటి గ్రహణ శక్తులు, వాటి విషయాలు, వాటి జ్ఞానం, హృద్గుహలలో ఉంటూ జీవశక్తులు సంచరించే ఏడేడు లోకాలు, అన్నీ ప్రభ విస్తాయి. ఇవన్నీ ఏడేడుగా భగవంతుడే సృష్టించాడు.

అతః సముద్రా గిరియశ్చ సర్వేఽస్మాత్
స్యన్దన్తే సిన్ధవః సర్వరూపాః।
అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ
యేనైష భూతైస్తిష్ఠతే హ్యన్తరాత్మా॥ 9

అన్ని సముద్రాలు, పర్వతాలుకూడా భగవంతుడు నుండే సంభవిస్తాయి. అన్ని నదులు ఆయననుండేప్రవహిస్తాయి. ఏ మూలికల రసాలుచేత పోషింపబడి పంచభూతాలచేత ఆవరింపబడిన సూక్ష్మశరీరం ఉంటున్నదో ఆ మూలికలన్నీ ఆ పరతత్త్వం నుండే సంభవిస్తాయి.

పురుష ఏవేదం విశ్వం కర్మ
    తపో బ్రహ్మ పరామృతమ్।
ఏతద్యో వేద నిహితం గుహాయాం
    సోఽవిద్యాగ్రన్థిం వికిరతీహ సోమ్య॥ 10

స్వగతమైన ఆ తత్త్వం యజ్ఞకర్మలు జ్ఞానం తపస్సు ఈ సమస్తంలోను ఉన్నది. ఓ సౌమ్యుడా ! హృద్గుహలలో ఒదిగివున్న సర్వ శ్రేష్ఠమూ అమరమూ ఐన బ్రహ్మం ఆ తత్త్వమే అని తెలుసుకొన్న వాడు అవిద్యాగ్రంథిని తెంచివేసి ఈ జన్మలోనే ముక్తుడవుతాడు.

ఇది రెండవ ముండకంలో మొదటి ఖండం.

## ద్వితీయ ఖండం

ఆవిః సన్నిహితం గుహాచరం నామ
    మహత్పదమత్రైతత్ సమర్పితమ్ ।
ఏజత్ ప్రాణాన్నిమిషచ్చ యదేతత్ జానథ సదసద్వరేణ్యం
    పరం విజ్ఞానాద్ వరిష్ఠం ప్రజానాం ॥ 1

అన్ని అనుభవాలలోను ప్రత్యక్షమయ్యేది అత్యంత సమీపంలో ఉన్నది. హృద్గుహలో సంచరించేది ఐన ఈ బ్రహ్మం అన్నింటికి ఆశ్రయం. కదిలేవి, శ్వాసించేవి, రెప్పలార్చేవి, ఆర్చనివికూడా సమస్తము ఆ బ్రహ్మంలోనే ప్రతిష్ఠితమై ఉన్నవి. స్థూలసూక్ష్మాలకు కారణం సర్వారాధ్యం, సర్వోత్కృష్టం, విజ్ఞానానికి కూడా అతీతమైన ఆ బ్రహ్మాన్ని తెలుసుకో.

యదర్చిమద్ యదణుభ్యోఽణు చ
    యస్మిన్‌లోకా నిహితా లోకినశ్చ ।
తదేతదక్షరం బ్రహ్మ స ప్రాణస్తదు వాఙ్మనః
    తదేతత్సత్యం తదమృతం తద్వేద్ధవ్యం సోమ్య విద్ధి ॥ 2

ప్రకాశవంతం అణువుకంటే సూక్ష్మం ఐన ఆ అక్షరబ్రహ్మం సకల లోకాలకు ఆ లోకవాసులకు కూడనిలయం. ఆ బ్రహ్మమే ప్రాణం వాక్కు మనస్సు సద్వస్తువు అమరత్వంకూడ.

ధనుర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం
    శరం హి ఉపాసానిశితం సన్ధయీత ।
ఆయమ్య తద్భావగతేన చేతసా
    లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి ॥ 3

ఉపనిషత్తులు అందించే మహాస్త్రాన్ని ధనుస్సుగా తీసుకో. నియమానుసారం నిత్యం చేసే ఉపాసనవలన తీక్ష్ణమైన బాణాన్ని ఎక్కుపెట్టు. ఎటూ చెదరకుండా బ్రహ్మచింతనలోనే కేంద్రీకృతమైన మనస్సుచేత వింటినారిని చెవిదాకా లాగు! నాశంలేని బ్రహ్మమే లక్ష్యం. ఆ బ్రహ్మాన్ని తెలుసుకో.

ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే ।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥ 4

ఓం అనే ప్రణవమంత్రమే ధనుస్సు. లోనున్న ఆత్మయే బాణం. బ్రహ్మమే లక్ష్యం. ఏమరుపాటులేని మనస్సుతో ఆ లక్ష్యాన్ని ఛేదించాలి. బాణం లక్ష్యాన్ని ఛేదించి దానితో ఒకటైపోయినట్లే బ్రహ్మంతో ఐక్యమైపోవాలి.

యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్షమోతం
మనః సహ ప్రాణైశ్చ సర్వైః।
తమేవైకం జానథ ఆత్మానమ్ అన్యా
వాచో విముఞ్చథా అమృతస్యైష సేతుః॥ 5

భూమ్యాకాశాలు వాటి మధ్యనున్న అంతరాళము, మనస్సు పంచప్రాణాలు దేనియందు పడుగు పేకగా అల్లుకొని ఉన్నాయో అదే ఆత్మ అని తెలుసుకో. తదితరమైన వ్యర్థప్రసంగాలు వదిలిపెట్టు. ఈ సంసారసాగరాన్ని దాటి అమరత్వం చేర్చే సేతువు ఇదే.

అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః
స ఏషోఽన్తశ్చరతే బహుధా జాయమానః।
ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం
స్వస్తి వః పారాయ తమసః పరస్తాత్ ॥ 6

రథ చక్రంలోని ఆకులన్నీ ఇరుసును చేరి ఉన్నట్లు, శరీరం లోని అన్ని నాడులు సిరలు చేరి ఉండే హృదయకోశం లోలోపల ! ఆత్మ అనేక విధాలై సంచరిస్తూ ఉంటుంది. ఆ ఆత్మనే ఓం అని ధ్యానించండి. అజ్ఞానాంధకారాన్ని దాటిపోవడంలో మీకు శుభం కలుగుగాక!

యః సర్వజ్ఞః సర్వవిద్యస్యైష మహిమా భువి ।
దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమ్న్యాత్మా ప్రతిష్ఠితః॥
మనోమయః ప్రాణ శరీరనేతా
ప్రతిష్ఠితోఽన్నే హృదయం సన్నిధాయ ।
తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరా
ఆనందరూపమ్ అమృతం యద్విభాతి ॥ 7

ఆత్మకు అన్నీ అవగతమే. సమగ్రంగా తెలుసు.ఈ భూమిపైన కనిపించేదంతాకూడా ఆ ఆత్మవైభవమే. హృదయాకాశంలోని జ్యోతిర్మయమైన బ్రహ్మపురిలో దాని నివాసం. మనస్సే

దానికి వస్త్రం. ప్రాణ శరీరాలకు అది అధినేత. హృదయంలో స్థిరపడి అది శరీరమంతటా నివసిస్తుంది. పరిపూర్ణమైన విజ్ఞానంచేత ప్రాజ్ఞులు ఆనందమయమైన ఆ అమరత్వస్థితిని సాక్షాత్కరించు కుంటారు.

భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః ।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥ 8

ఎగుడు దిగుడులలో కూడా ఆత్మను సాక్షాత్కరించుకోవడం వలన అతని అజ్ఞానపు ముడి విడిపోతుంది. అన్ని సంశయాలు సమసిపోతాయి. అన్ని కర్మలు క్షయించిపోతాయి.

హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కలమ్।
తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిస్తద్యద్ ఆత్మవిదో విదుః ॥ 9

జ్యోతిస్వరూపమైన ఆ ఆనందమయకోశంలో మానవుని నిగూఢ గహనాలలో నిర్మలంనిరవయవం విశుద్ధం ఐన బ్రహ్మం వాసం చేస్తుంది. కాంతి నిచ్చే అన్నింటికి కాంతి అదే. దాన్నే ఆత్మవిదులు సాక్షాత్కరించుకుంటారు.

న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం
నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః।
తమేవ భాన్తమనుభాతి సర్వం
తస్యభాసా సర్వమిదం విభాతి ॥ 10

అక్కడ సూర్యుడు ప్రకాశించడు. చంద్రుడు తారలు వెలుగు నీయవు. మెరుపులుకూడ కాంతి నీయవు. ఇక కేవలమైన అగ్ని మాట చెప్పడమెందుకు ? ఆత్మ తేజస్సు వల్ల మాత్రమే సర్వమూ కాంతులీనుతుంది! ఈ యావద్విశ్వమూ ఆ ఆత్మజ్యోతి వల్లనేదేదీప్యమానమవుతూ ఉన్నది.

బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ
పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ ।
అధశ్చోర్ధ్వం చ ప్రసృతం
బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్ ॥ 11

నిజంగా ఇదంతా శాశ్వతమైన బ్రహ్మమే. కింద మీద ఈ పక్క ఆ పక్క ముందు వెనుక సర్వత్రా ఆ బ్రహ్మం విరాజమానమై ఉన్నది. నిజంగా ఈ యావద్విశ్వం సర్వోత్కృష్టమైన ఆ బ్రహ్మమే.

ఇది రెండవ ముండకంలో రెండవ ఖండం.

# తృతీయ ముండకం

## ప్రథమ ఖండం

ద్వా సుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే ।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య
అనశ్నన్ అన్యో అభిచాకశీతి ॥ 1

ప్రాణ స్నేహితులై ఎప్పుడూ కలిసి ఉండే రెండు పక్షులు ఒకే చెట్టుపైన కూర్చొని ఉన్నవి. వాటిలో ఒకటి చెట్టు పండ్లను ఆసక్తితో తింటుంది. మరొకటి ఏమీ తినకుండా చూస్తూ ఉన్నది.

సమానే వృక్షే పురుషో నిమగ్నోఽ
నీశయా శోచతి ముహ్యమానః।
జుష్టం యదా పశ్యత్యన్యమ్
ఈశమస్య మహిమానమితి వీతశోకః॥ 2

ఒకే చెట్టుమీద కూర్చున్న ఆ రెండింటిలో ఒకటి జీవాత్మ. అజ్ఞానంలో భ్రమలో మునిగి తన దౌర్బల్యానికి దుఃఖిస్తున్నది. కానీ ఆరాధనీయమైన ప్రభువైన దానిని, పరమాత్మను, దాని వైభవాన్నీ చూడగానే దాని దుఃఖమంతా తరిగిపోతున్నది.

యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం
కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం।
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ
నిరంజనః పరమం సామ్యముపైతి॥ 3

స్వయంప్రకాశమైన, సృష్టికర్తయైన బ్రహ్మకుకూడా ఆదియైన, సకల జగత్తుకు కర్తయైన, ప్రభువైన పరమాత్మను సాక్షాత్కరించుకోగానే విద్వాంసుడైన సాధకుడు పుణ్యపాపాల నతిక్ర మించి దుఖఃరహితము సర్వోత్కృష్టం సమస్థితిని చేరుకుంటాడు.

ప్రాణో హ్యేష యః సర్వభూతైర్విభాతి
విజానన్ విద్యాన్ భవతే నాతివాదీ।
ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావాన్
ఏష బ్రహ్మవిదాం వరిష్ఠః॥ 4

ప్రాణమై ఆ ఈశ్వరుడే సకల జీవులలో ప్రకాశిస్తున్నాడు. ఇది సాక్షాత్కరించుకొన్నవాడు వాక్కును నిగ్రహించి, నిజమైన విద్వాంసుడవుతాడు. అతడు నిత్యం ఆత్మయందే విహరిస్తూ ఆత్మయందే ఆనందిస్తూ పుణ్యకర్మలను చేస్తూ బ్రహ్మజ్ఞానులలో అగ్రస్థానం వహిస్తాడు.

సత్యేన లభ్యస్తపసాహ్యేష ఆత్మా
సమ్యగ్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్ ।
అంతఃశరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
యం పశ్యన్తి యతయః క్షీణదోషాః ॥ 5

ఆత్మ నిగ్రహం గలవారు తమలోని పాపకల్మషం లేశమాత్రం కూడా లేకుండా క్షయించి పోగా జ్యోతిర్మయం పరిశుద్ధం ఐన ఆత్మను సాక్షాత్కరించుకుంటారు. సత్యం తపస్సుధ్యానం జ్ఞానం బ్రహ్మచర్యం చక్కగా నిరంతరాయంగా అభ్యసించడం చేత ఆ ఆత్మ మనస్సులోనే లభ్యమవుతుంది కదా!

సత్యమేవ జయతే నానృతం
సత్యేన పన్థా వితతో దేవయానః।
యేనాక్రమన్తి ఋషయో హి ఆప్తకామా
యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్ ॥ 6

సత్యవాదులే గెలుస్తారు. అసత్యవాదులు నెగ్గరు. దేవయానం సత్యం చేతనే ఏర్పడి ఉన్నది. కోరికలులేని ఋషులు ఈ మార్గంద్వారానే నిత్యనిలయమైన పరమపదాన్ని చేరు కుంటారు.

బృహచ్చ తద్ దివ్యమ్ అచిన్త్యరూపం
సూక్ష్మాచ్చ తత్ సూక్ష్మతరం విభాతి।
దూరాత్ సుదూరే తదిహాన్తికే చ
పశ్యత్సు ఇహైవ నిహితం గుహాయామ్॥ 7

అపరిమితమై, జ్యోతిస్వరూపం ఊహాతీతమై బ్రహ్మం ప్రకాశిస్తుంది. అది సూక్ష్మాతి సూక్ష్మం, దూరాతి దూరం. అది ఇక్కడే ఈ శరీరంలోనే ఉన్నది. ఋషులు హృదయస్థమై ఉన్నదానిని ఈ జన్మలోనే సాక్షాత్కరించుకుంటారు.

న చక్షుషా గృహ్యతే నాపి వాచా
నాన్యైర్దేవైస్తపసా కర్మణా వా।
జ్ఞానప్రసాదేన విశుద్ధ సత్త్వస్
తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః॥ 8

ఆత్మను మాటలచేత వర్ణింపనలవికాదు, దాన్ని కళ్లు చూడలేవు. ఇంద్రియాలు గ్రహించ లేవు. కర్మలు విధులు దానిని ఆవిష్కరించలేవు. అవబోధ ప్రశాంతమై స్వచ్ఛమైనపుడు అతని

ప్రాణ మన శ్శరీరాలు సర్వం విశుద్ధి పొందుతాయి. అపుడు ధ్యానమగ్నుడైనవాడుఆత్మను సాక్షా త్కరించుకుంటాడు.

ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యో
యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ।
ప్రాణైశ్చిత్తం సర్వమోతం ప్రజానాం
యస్మిన్ విశుద్ధే విభవ త్యేష ఆత్మా॥ 9

ప్రాణం ఐదు విధాలుగా వ్యాపించి ఉన్న ఈ శరీరంలో సూక్ష్మమైన ఆత్మతత్త్వాన్ని విజ్ఞానంద్వారా తెలుసుకోవాలి. మానవుని జ్ఞానాన్ని ఇంద్రియాలు చిక్కగా అల్లుకొని ఉన్నాయి. ఆ జ్ఞానం స్వచ్ఛం నిర్మలం కాగానే ఆత్మ అందులో భాసిస్తుంది.

యం యం లోకం మనసా సంవిభాతి
విశుద్ధసత్త్వః కామయతే యాంశ్చ కామాన్।
తం తం లోకం జయతే తాంశ్చ కామాం -
స్తస్మాద్ ఆత్మజ్ఞం హ్యర్చయేద్ భూతికామః॥ 10

శుద్ధసత్త్వుడు ఏ లోకంపై మనసుపడినా ఏ కోరికలు కోరినా అవి అతనికి తక్షణమే సిద్ధిస్తాయి. కాబట్టి లోకంలో సంపన్నుడు కాదలచినవాడు ఆత్మజ్ఞానిని ఆరాధించాలి!

ఇది మూడవ ముండకంలో మొదటి ఖండం

## ద్వితీయ ఖండం

స వేదైతత్ పరమం బ్రహ్మ ధామ యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రమ్।
ఉపాసతే పురుషం యే హ్యకామాస్తే శుక్రమేతదతివర్తంతి ధీరాః॥ 1

ఆత్మసాక్షాత్కారం పొందినవాడు ఉజ్జ్వలమై ప్రకాశించేది, సకల జగత్తుకు ఆధారమైనది ఐన బ్రహ్మాన్ని తెలుసుకుంటాడు. అట్టి పురుషుని పట్ల నిష్కాములై శ్రద్ధాళువులైనవారు పునర్జన్మ బాధను దాటిపోతారు.

కామాన్యః కామయతే మన్యమానః
స కామభిర్జాయతే తత్ర తత్ర।
పర్యాప్తకామస్య కృతాత్మనస్తు
ఇహైవ సర్వే ప్రవిలీయంతి కామాః॥ 2

ఇంద్రియభోగాలను పదే పదే తలుచుకుంటూ వాటికోసం ఆరాటపడేవాళ్లు ఆ కోరికలు తీరడానికిగాను అక్కడక్కడ జన్మలెత్తుతారు. కాని ఆత్మ లాభంపొంది అన్ని కోరికలను ఆత్మలో నేలయం చేసిన ధన్యుడికి ఈ జన్మలోనే అన్ని కోరికలూ అదృశ్యమై పోతాయి.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన।
యమేవైష వృణుతే తేన లభ్య
స్వస్యైష ఆత్మా వివృణుతే తనుం స్వామ్॥ 3

గొప్ప ఉపన్యాసాలు ఇవ్వడంచేతగాని చాల శాస్త్రాల అధ్యయనం చేయడంవలనగాని ఎన్నో గూఢార్థాలు మహాత్ములవద్ద వినడం వలన గాని ఆత్మప్రాప్తి జరుగదు. ఆ ఆత్మకోసం హృదయపూర్వకంగా ఆరాటపడి మనన నిధి ధ్యాసలు చేసే వ్యక్తికే ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది. అట్టి వ్యక్తికే ఆత్మ తన స్వరూపాన్ని వెల్లడిస్తుంది.

నాయమాత్మ బలహీనేన లభ్యో
నచ ప్రమాదాత్ తపసో వాప్యలింగాత్।
ఏతైరుపాయైర్యతతే యస్తు విద్వాం
స్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ॥ 4

ఆత్మ మనోబలం లేనివారికి, అజాగ్రత్తపరులకు, శాస్త్రవిరుద్ధమైన తపస్సులు చేసేవారికి లభించదు. అయితే దృఢంగా శ్రద్ధ ఉంచి తగిన విధంగా ప్రయత్నించే వారి ఆత్మ బ్రహ్మ పదంతో ఐక్యం పొందగలదు.

సంప్రాప్యైనమృషయో జ్ఞానతృప్తాః
కృతాత్మానో వీతరాగాః ప్రశాన్తాః।
తే సర్వగం సర్వతః ప్రాప్యధీరా
యుక్తాత్మానః సర్వమేవాఽవిశన్తి॥ 5

ఆత్మలాభం పొందిన ఋషులు ఆత్మజ్ఞానంతో సంతుష్టులవుతారు. ఇక వారికి కావలసిం దేమీ లేదు. వారు పరమాత్మస్వరూపులు సంగరహితులు శమించిన ఇంద్రియాలు కలవారు. సర్వవ్యాపియైన బ్రహ్మాన్ని ఎల్లెడల సాక్షాత్కరించుకొని ప్రాజ్ఞులైన ఆ వినీతమతులు అన్నింటా ప్రవేశిస్తారు.

వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థా:
సన్న్యాసయోగాద్ యతయః శుద్ధసత్త్వాః।
తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే
పరామృతాః పరిముచ్యంతి సర్వే॥ 6

వైరాగ్యమయమైన జీవనం ద్వారా నిరంతరాభ్యాసం ద్వారా పవిత్రస్వభావులై, వేదవేదాం తాలు అన్వేషించే పరమాత్మయందే సుస్థిరులైన సాధకులు సాక్షాత్కార సమయంలో అమరులై బ్రహ్మీభూతులవుతారు. అన్నివిధాలా ముక్తులవుతారు.

గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా
దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు।
కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా
పరేఽవ్యయే సర్వ ఏకీభవన్తి॥ 7

వారి పదిహేను అంశాలు వాటి స్థావరాల్లోకి చేరిపోతాయి. ఇంద్రియాలు వాటి వాటి అధిదేవతలలో లీనమవుతాయి. వారి కర్మలు, జీవాత్మ పరమమైన అక్షయతత్త్వంలో ఐక్య మవుతాయి.

యథా నద్యః స్యందమానాః సముద్రే
ఽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ।
తథా విద్వాన్నామరూపాద్విముక్తః
పరాత్పరం పురుషముపైతి దివ్యం॥ 8

ప్రవహించే నదులు వాటి పేర్లను ఆకారాలను కోలుపోయి ఎలా సముద్రంలో ఏకమవు తాయో అలాగే జ్ఞానికూడ తన నామరూపాల నుండి ముక్తుడై సర్వోత్కృష్టం దీప్యమానం ఐన పరబ్రహ్మతత్త్వంలో లీనమవుతాడు.

స యో హ వై తత్పరమం బ్రహ్మవేద
బ్రహ్మైవ భవతి నాస్య అబ్రహ్మవిత్కులే భవతి।
తరతి శోకం తరతి పాప్మానం
గుహాగ్రన్థిభ్యో విముక్తో ఽమృతో భవతి॥ 9

ఆ పరబ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకున్న ప్రతివాడు పరబ్రహ్మమే అవుతాడు. బ్రహ్మవిదుడు కానివాడు అతని వంశంలో జన్మించడు. హృదయగ్రంథులు కరిగిపోగా అతడు శోకపాపాలకు అతీతుడై శాశ్వతమైన అమరత్వాన్ని అందుకుంటాడు.

తదేతదృచాఽభ్యుక్తం--

క్రియావన్తః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః
స్వయం జుహ్వత ఏకర్షిం శ్రద్ధయన్తః।
తేషామేవైషాం బ్రహ్మవిద్యాం వదేత
శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్॥ 10

ఈ సిద్ధాంతమే క్రింది వేదమంత్రంలో చెప్పబడింది. కర్మనిష్ఠులకు వేదపారంగతులకు బ్రహ్మను ఉపాసించేవారికి శ్రద్ధావంతులకు ఏకర్షి అనే అగ్నికి ఆహుతులిచ్చే వారికి శాస్త్రోక్తంగా శిరోవ్రతాన్ని అనుష్ఠించిన వారికి మాత్రమే ఈ బ్రహ్మవిద్యను ఉపదేశించాలి.

తదేతత్ సత్యమృషిరంగిరాః
పురోవాచ నైతద చీర్ణవ్రతో౾ధీతే।
నమః పరమ ఋషిభ్యో
నమః పరమ ఋషిభ్యః॥ 11

ఇతి తృతీయముండకే ద్వితీయ ఖండః।

ఇదే పరమసత్యం. ఈ సత్యాన్నే ప్రాచీనకాలంలో ఆంగిరసుడు తన శిష్యులకు ఉపదేశించాడు. ఏ వ్రతాన్నీ అనుష్ఠించనివాడు దీన్ని అధ్యయనం చేయరాదు. మహాఋషులారా! మీకు నమస్సులు మహాఋషులారా! మీకు నమస్సులు.

ఇది మూడవ ముండకంలో రెండవ ఖండం.

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః
భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః।
స్థిరైరంగైస్తుష్టువాగంస స్తనూభిః
వ్యశేమ దేవహితం యదాయుః॥
స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తి నః పూషా విశ్వవేదాః।
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్థి నో బృహస్పతి ర్దధాతు॥

ఓం శాంతిః శాంతిః శాంతిః
ముండక ఉపనిషత్తు సమాప్తమ్.